బొందిక కందని భిన్నాంశముల సమన్వయ రూపమై యుండుటలో ఆశ్చర్య మేమి ? పానుగంటి వారి వ్యక్తిత్వమును గూర్చి మొదట చెప్పుకొనదగిన దే యిది. వారిలో ఎంత ఉదాత్తత యున్నదో అంత పరిహాస ప్రియత్వ మున్నది. ఎంత మార్దవమున్నదో అంత ఆక్షేపణ హాస్యమున్నది. వారి పాత్రలందు గూడ ఇట్లే ప్రధానములగు రెండు వర్గములను ఏర్పరుప వచ్చు నని వివరింపబడెను గదా ! పంతులుగారి మనస్సు సాత్వికతా ప్రధానమో రాజసిక ప్రధానమో నిశ్చయించుటే కష్టము.

వారి పాత్రలలో చాల భాగము ఎదిరి పాత్రలు పలికిన పలుకులను దూరేకిన ట్లేకి పూర్వపక్షము చేసి ఆక్షేపించు చుండును సామాన్యముగా కనుపట్టని సూక్ష్మాంశములను వెలికి లాగుట, ఆ యంశములను అపహాస్యము చేయుటలో నిర్దాక్షిణ్యముగా వ్యవహరించుట ; అసంగతమైన దానిని గూడ సుసంగతముగా నిరూపింపగల తార్కిక ప్రతిభ వెలయించుట ఈ అధిక్షేపణము నందు జూడవచ్చును ఇది పానుగంటి వారి తత్వమును గొంత పట్టియిచ్చును. పంతులుగారు క్రొత్తవారి నడుమ నున్నప్పుడు ఎక్కువగా మాటలాడెడివారు కారని, పరిచితుల నడుమ మాత్రము విశేషముగా ప్రసంగించెడి వారని విన వచ్చుచున్నది. అట్టి సంభాషణములలో తడుముకొనకుండ వారు ఎల్లరను అధిక్షేపించు చుండెడివారు

పానుగంటి వారిలో ఉన్న సంశ్లిష్ట వ్యక్తిని గూర్చి ఆలోచింపగా మరియొకఊహ తోచును. పంతులుగారు అంతరంగములో సాత్వికస్వభావులు; పైకి నిత్య జీవితములో రాజసి. రాజామాత్యులుగా, ఆస్థానకవులుగా ఉండిన వారు ఇట్లగుటలో వింతలేదు. ఈ గుణద్వయ సమ్మేళనములో వారికి విశిష్ట వ్యక్తిత్వము అబ్బినది ఒక విషయముపై వారికెంత లాలన ఉండెడిదో, అంత వైరాగ్యము కూడ వారికుండి యుండవలెను పారమార్థికముగా వారికి ఎంత వినమ్రత యున్నదో ఐహికముగా అంత ఆత్మ విశ్వాసాధిక్య మున్నది.

పంతులుగారి స్వస్థాన వేష భాషాభిమానము బహుతర ప్రశంసనీయము. అట్టి యభిమానమును సమకాలికులలో కలిగించి నిలువ బెట్టుటకు వారొన

రించిన కృషి అనల్పము వారు జ్ఞానము అంగమైన భక్తిని ముక్తి మార్గ ముగా గ్రహించిరి. వారు శ్రీరామ భక్తులు. భక్తిరస పోషణయందు వారెట్టి యున్నత శిఖరములను అందుకొనిరో పరిశీలించిన భగవద్విషయిక మైన వారి ఆవేదన స్వరూపమును గమనించిన పంతులుగారి ఆధ్యాత్మిక శీలము బోధపడును.

## ఉపసంహారము

పంతులుగారు కందుకూరి వీరేశలింగముగారు ఆద్యులై శ్రీకారము చుట్టిన ఉద్యమమును చేపట్టి దృఢము కావించిరి. గద్య వాఙ్మయాభి వృద్ధి యగుట సంఘాభ్యున్నతికి అత్యంతావశ్యకమని విశ్వసించి తత్కృతికి నడుము గట్టిరి. అవహేళనాధిక్షేపణ హాస్యరీతులను ఆదరించి సంఘ సంస్కారము నిమిత్తమై విస్తృత వాఙ్మయ సృష్టి గావించిరి

వీరేశలింగము గారిచే ప్రభావితులైనను రచనా పద్ధతియందు ఇరువుర కును ఎంతయు భేదమున్నది. అనేక హేతువులచే వీరేశలింగముగారు తమ రచనలలో సాధింపలేకపోయిన కళా గౌరవము పానుగంటివారు నిస్సందేహ ముగ సాధించిరి; సంఘ సంస్కరణ కృషికి సాహిత్య సృష్టి ఒక సాధనముగ గ్రహించిన వీరేశలింగముగారు సాహిత్య మార్గమున తాము క్రొత్తపుంతలు త్రొక్కినను, వారి సృజనాత్మక శక్తికి అవి పరిణత రూపములు కాలేదు పానుగంటివారు దేశమునందు పూర్వమే నెలకొనియున్న సాహిత్యప్రక్రియ లలో తమ సృజనాత్మక శక్తిని తాండవింపజేసి వానిలో క్రొత్త రూపము లను, క్రొత్త తేజమును ఆవిష్కరించిరి,

ఆశయము, ఆచరణ; కుతూహలము, శక్తి; ప్రతిభ, వ్యుత్పన్నత పానుగంటి కవీంద్రునిలో సమన్వయము పొందినవి. గద్య వాఙ్మయ సృష్టిలో రూపక సాహిత్య సృష్టిలో హాస్య వాఙ్మయ సృష్టిలో పంతులుగారు నవ్యాంధ్ర వాఙ్మయ చరిత్రమున విశిష్ట స్థానమును గెలుచుకొనిరి. "రాజును చూచిన కంటితో మగని జూచిన" అను సామెతకు లక్ష్యభూతులుగా నున్న ఆంగ్ల విద్యా వ్యామోహితుల కన్నులు చెదరునట్లుగా పంతులుగారు వినూతన

సృష్టి కావించి తెలుగు పరువు నిలువబెట్టిరి అట్టి మహనీయుని ఋణమును తెలుగు భాషా సారస్వతాభిమాను లెట్లు తీర్చుకొనగలరు ?

పానుగంటి వారి కృతులన్నింటిని సవిమర్శముగా పరిశీలనము చేయుటకు ఇది తొలి ప్రయత్నము. ఎడనెడ పత్రికావ్యాసములలో, విమర్శన వ్యాసములలో సంగ్రహముగా పంతులుగారి కృషి శ్లాఘింపబడి యున్నది. కాని విపులమగు చర్చ మాత్రము చేయుబడలేదు. ఈ పరిశీలనమైనను ఉన్నంతలో సమగ్రమే కాని, జరుగుటకు అవకాశమున్న బృహత్కృషి దృష్టితో ప్రాథమికమే. మహా మేధావి యగు రచయిత జీవిత కృషిని సంపూర్ణముగా వివరించి వైచుటకు అయిదారేండ్ల కాలము పెద్ద వ్యవధి కాదు. శ్రద్ధాసక్తులతో, గౌరవ తాత్పర్యములతో చేసిన ప్రయత్నము మాత్రమే ఇది.

ఈ ప్రయత్నమును హర్షించుటకు మరియొక మాట గమనింపవలసి యున్నది. విరివియగు నొక దృశ్యమును ఒక పటమున గీచినప్పుడు అందు పొందుపరచగల వివరములు తక్కువ యగును అదే విధముగా ఇచ్చట సూక్ష్మ విచారము కొంతవరకు వదలివేసి, మునుముందు జరుగదగిన కృషికి సోపానములు కట్టుటయే చేయవలసి వచ్చినది ఈ పరిశీలనలో నిరూపింప బడిన పథకము, వెలువరింపబడిన విశేషములు భవిష్యత్తులో జరుగు కృషికి గట్టి పునాది కాగలదని ఆశింపవచ్చును. ఆ విధమగు పునాది నిర్మించుటలో శక్తివంచనగాని, అంతఃకరణ శుద్ధి లోపముగాని జరుగలేదని నా ధైర్యము.

— o —